## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **తెలుగు భక్తి** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **తెలుగు భక్తి** వారి వెబ్ సైట్: http://www.telugubhakti.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## తెలుగు భక్తి వారి వెబ్ సైట్:

## http://www.telugubhakti.com/

Telugu Bhakti Slokas

www.telugubhakti.com/telugupages/main.htm

# Telugu Bhakti Pages

www.telugubhakti.com

**Best viewed with screen settings 1280X1024 pixels**

### Scriptures, Slokas and Stotras

Adi Sankaracharya
Aditya
Adwaitam
Ayyappa
Bhagavad Geetha
Bammera Pothana
Bhagavatam
Brahma Sutras
Durga
Dattatreya
Ganesh
Gayatri
Guru
Hanuman
Hindu Marriage System
Krishna
Lakshmi
Mahabharat
Mantrapushpam
Narada Bhakti Sootralu
Nava Grahas
Patanjali Yoga Sootralu
Raghavendra
Rama
Ramayanam
Rama Geeta
Saraswathi
Sandharbha
Satya Sai
Shirdi Sai
Siva
Slokas with meaning
Subrahmanya
Suktas
Sundara Kanda
Venkatesa
Vishnu
Vratas
Upanishads
Rigveda
Samhitaanuvadam
(Yoga Paranga)
Vyasa Bhagavatam

### General

Appeal and Objectives
Bala Basha
Bhakti Celebrities
Bhakti Classicals
Bhakti Links
Book Reviews
Jeji Mamayya Patalu
Chatuvulu
Dasa Mudrani
Divine Guidance of Satya Sai
Kavitha Kadambam
Keerthanalu
Koonalamma Padalu
Prasnalu - Javaabulu
Naturopathy
Rishi Vani
Sai Krishna's Art
Satakalu
Swamiji
Tatvalu
Telugu Special
Useful Links
Value Education
Web Hunt
Hindu Cultural
Questions & Answers
Yoga
Yoga Mudralu Bandhalu
Yogasanas (Detailed)

### Downloads

Audio Downloads
Bhakti Screen Savers
Printer Friendly Page

### Pravachanaalu

Bhaja Govindam
Bhasmo Dhulita Vigrahaya
Karma Siddhantam
Class Prayers
Kenopanishad
Sri Narasimha Charitram
Soundarya Lahari
Ramana Saranagathi
Vivekachoodamani

### Specials

Annamayya Pada Visleshana
Monthly
Satsang
Chinna Kathalu
Class Prayers
Human Relations
Nadiche Devudu
Stories of Alwars
Stories of Bhaktas
Stories of Indian Sages
Stories of Nayanars
Sankara Vangmayamu
Special Articles
Hinduism and Mantras
Personality Development

Join Bhakti Group

Statistics of page views

[About us][Mission][People][Links][Books]][Guest Book][Contact]

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



# శ్రీకృష్ణ శతకము

క. శ్రీరుక్మిణీశ! కేశవ!
నారద సంగీతలోల నగధర శౌరీ
ద్వారక నిలయ జనార్ధన
కారుణ్యముతోడ మమ్ము గావుము కృష్ణా! 1

రుక్మిణీదేవికి భర్తవు! పరమేశ్వరుడవు! నారద అమర సంగీతనందు ప్రియము చూపువాడవు! గోవర్ధన పర్వతమును నీ చిటికెన వ్రేలితో నెత్తి గో-గోపాలురను సంరక్షించినవాడవు! ప్రజలను సర్వదా కాపాడే ద్వారకావాసీ! ఓ శ్రీకృష్ణా! మమ్ము దయతో కాపాడుము స్వామీ.

క. నీవే తల్లివి దండ్రివి
నీవే నా తోడు నీడ నీవే సఖుడౌ
నీవే గురుడవు దైవము
నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా! 2

ఓ కృష్ణా! నీవే నాకు తల్లివి, తండ్రివి, సహాయకుడివి., సఖుడవు, నా గురువు కూడా నీవే. నా దైవము, ప్రభువు, పతి గతి గూడా నీవే అయివున్నావు. ఇలా సమస్తమునీవే అయివున్నావు.

క. నారాయణ పరమేశ్వర
ధారాధర నీలదేహ దానవవైరీ
క్షీరాబ్దిశయన యదుకుల

వీరా ననుగావు కరుణ వెలయగ కృష్ణా! 3

శ్రీమన్నారాయణ! పరమేశ్వరా! ఓ నీలమేఘశ్యామా! రాక్షసవైరీ! పాలసముద్రమున శయనించువాడా! యదుకులవీరా! నన్ను దయతో రక్షించవయా.

క. హరియను రెండక్షరములు
హరియించును పాతకముల నంబుజనాభా!
హరి నీ నామ మహత్త్వము
హరి హరి పొగడంగవశమె హరి శ్రీకృష్ణా! 4

నీ హరియను రెండక్షరముల మా పాపములను పోగొట్టుచున్నవి. ఓ క్రిష్ణా! నీ పేరు లోని మహత్మ్యము గురించి కీర్తించటంమాకు సాధ్యమా?

క. క్రూరాత్ముఁ డజామీళుడు
నారాయణ యనుచు నాత్మనందను బిలువన్
ఏ రీతి నేలుకొంటివి
యేరీ నీ సాటివేల్పు లెందును కృష్ణా! 5

ఓ కృష్ణా క్రూరుడైన అజామిళుడు తన మరణకాలమున తన కుమారుని 'నారా యణా' యని పిలిచినంతనే నీవా క్రూరాత్మునికి మోక్షమిచ్చి కాపాడితివి. నీ సాటి వేల్పులు ఎవరున్నారు? లేరని భావము.

క. చిలుక నొక రమణి ముద్దులు
చిలుకను శ్రీరామయనుచు శ్రీపతి పేరుం
బిలిచిన మోక్షము నిచ్చితి
వలరగ నిను దలఁచు జనుల కరుదా కృష్ణా! 6

తనపెంపుడు చిలుకనే శ్రీరామాయని పిలిపించినంత మాత్రమునే నొకామెకు మోక్షమునిచ్చావు. అట్టి ఓ కృష్ణా! నిన్ను తలచినవారికి మోక్షము ప్రాప్తించదా!

క. అక్రూరవరద మాధవ
చక్రాయుధ ఖడ్గపాణిశౌరి ముకుందా
శక్రాది దివిజసన్నుత

శుక్రార్చిత నన్ను కరుణఁజూడుము కృష్ణా! 7

ఓ కృష్ణా! అక్రూరుడను భక్తునికి కోరిన వరమిచ్చినవాడా! మాధవా! చక్రాయుధ ధారీ! ఖడ్గము చేతియందు ధరించినవాడా! పరాక్రమోత్తముడా! ముకుందా! ఇంద్రాది దేవతలచే నుతించబడువాడా! శుక్రాచార్యునిచే పూజింపబడిన వాడా! ఓ ముకుందా! దయతో మమ్ము కాపాడుము.

క. నందుని ముద్దుల పట్టివి
మందరగిరి ధరుని హరుని మాధవు విష్ణున్
సుందరస్వరూపుని మునిగణ
వందితు నిను దలఁతు భక్తవత్సల కృష్ణా! 8

ఓకృష్ణా! నీవు నందుని ముద్దులపట్టివి, మందరగిరిని మోసినవాడవు. కూర్మావతారుడవు. శ్రీహరి, విష్ణువు కూడా నీవే. లక్ష్మీదేవి భర్తవు. సుందరమైన స్వరూపము కలవాడవు. మునులందరిచే కొనియాడదగు వాడవు. భక్తవత్సలు డవగు నిన్నే ఎల్లపుడు మనసారా కొలిచెదను స్వామీ.

క. ఓ కారుణ్యపయోనిధి
నా కాధారంబు వగుచు నయముగఁ బ్రోవ
న్నా కేల యితర చింతలు
నాకాధిప వినుత లోకనాయక కృష్ణా! 9

ఓ కృష్ణా! సమస్తలోకాధిపతివైన నీవు దయాసముద్రుడవై నన్ను రక్షించుచుండగా నా కితర చింతనలతో పనియేమి? ఇంద్రునిచే నుతింపబడినవాడా! నా చింత లను బాపే సర్వాంతర్యామివి నీవేయైనపుడు నా కితర చింతలేల?

క. వేదంబులు గననేరని
యాది పరబ్రహ్మమూర్తి వనఘ మురారీ
నా దిక్కు జూచి కావుము
నీ దిక్కే నమ్మినాడ నిజముగ కృష్ణా! 10

ఓ మురారీ! నీవు వేదాంతములకు అతీతుడవు. నీవే దిక్కని మనఃపూర్వకముగా

నమ్మియుంటిని. నీ చల్లని చూపును నాపై ప్రసరింపజేసి దయజూపి కాపాడుము తండ్రీ!

క. పదునాలుగు భువనంబులు
కుదురుగ నీకుక్షి నిలుపుకొను నేర్పరివై
విదితంబుగ నా దేవకి
యుదరములో నెట్టు లొదిగియుంటివి కృష్ణా! 11

ఓ కృష్ణా! ప్రదునాలుగులోకములన్నింటినీ నీ బొజ్జలో నిలుపుకున్న నీవు, దేవకీదేవి చిన్ని గర్భములో నెటుల ఒదిగియుంటివో ! ఆశ్చర్యముగా నున్నది.

క. అష్టమి రోహిణి ప్రొద్దును
నష్టగర్భమున బుట్టి యా దేవకికిన్
దుష్టుని కంసు వధింపవె
సృష్టి ప్రతిపాలనంబు సేయగ కృష్ణా! 12

ఓ పరంధామా! శ్రీకృష్ణా! దేవకీదేవికి ఎనిమిదవ గర్భమున రోహిణీ నక్షత్రమున అష్టమి దినమునందు జనియించి పాపాత్ముడైన నీ మేనమామ కంసుని సంహ రించి లోకోద్ధరణ గావించితివి గదా!

క. అల్ల జగన్నాథుకు వ్రే
పల్లియ క్రీడార్థమయ్యె పరమాత్మునకున్
గొల్ల సతి యా యశోదయు
తల్లియునై చన్నుఁగుడిపె దనరగ కృష్ణా! 13

ఓ కృష్ణా! జగన్నాథా! సమస్తలోకాలకు అధిపతియైన నీకు వ్రేపల్లె ఆటస్థలమయ్యెను గదా! సాక్షాత్పరమేశ్వరునకే ఆ గొల్లసతియైన యశోద తల్లి అయ్యెను గదా! నీ మహాత్మ్య మెంత గొప్పది!

క. అందెలు గజ్జెలు మ్రోయగ
చిందులు ద్రొక్కుచును వేడ్క చెలువారంగా
నందుని సతి యా గోపిక

ముందర నాడుదువుమిగుల మురియుచు కృష్ణా! 14

ఓ కృష్ణా! బాల్యమునందు నీ కాలి అందెలతో, గజ్జెలతో ఘల్లు ఘల్లుమని గెంతుతూ, ఆడుచూ నందుని భార్య యశోద ముందర ముద్దులొలికే నీ మాటలతో అందరిని అలరించినావు.

క. హరిచందనంబు మేనున
కరమొప్పెడు హస్తములను కంకణ రవముల్
ఉరమున రత్నము మెఱయఁగఁ
బెరగితివౌ నీవు బాలప్రాయము కృష్ణా! 15

ఓ కృష్ణా! నీ శరీరము మంచిగంధముతో, అందమైన చేతులు కంకణములు, ఆభరణములతో, వక్షస్థలమున కౌస్తుభమణితో, ప్రకాశించుచున్న శరీరముతో ముద్దులొలుకుచు బాల్యమునంతా గడిపితివి.

క. పాణితలంబున వెన్నయు
వేణీమూలంబునందు వెలయఁగ పింఛం
బాణిముత్యము ముక్కున
నాణెముగా దాల్చు లోకనాథుఁడ కృష్ణా! 16

ఓ కృష్ణా! సమస్తలోకములకు ప్రభువైయుండిననూ నీవు చిన్నపిల్లవానివలె చేతిలో వెన్నముద్దతోనూ, తలపై నెమలిపింఛముతో, ముక్కున నవమౌక్తికము తోనూ, అల రారుతున్నావుగదా!

క. మడుగుకు జని కాళీయుని
పడగలపై భరతశాస్త్ర పద్ధతి వెలయన్
గడు వేడుకతో నాడెడు
నడుగులు నా మదిని దలఁతు నచ్యుత కృష్ణా! 17

ఓ కృష్ణా! కాళీయుని గర్వమణచ ఆ భయంకర కాళీయుని సర్పముపైననే సరస్సు నందు శాస్త్రపద్ధతిలో నాట్యమాడి, ప్రకాశించిన ఆ పాదపద్మములను నా మదిలో సదా స్మరింతును.

క. బృందావనమున బ్రహ్మా
నందార్భకమూర్తి వేణునాదము నీ వా
మందార మూలమున గో
విందా పూరింతువౌర వేడుక కృష్ణా! 18

ఓ కృష్ణా! మురారీ! బృందావనోద్యానములలో మందార వృక్షచ్ఛాయలో నవమోహన సుందర బాలగోపాలుడవై ప్రిల్లనగ్రోవినూదుతూ నీ ముగ్ధమనోహర సుందరరూప ముతో మమ్ములనానందపరచుదువు.

క. వారిజనేత్రలు యమునా
వారిని జలకంబులాడ వచ్చిన నీ వా
చీరలు మ్రుచ్చిలియిచ్చితి
నేరుపురా యదియు నీకు నీతియె కృష్ణా! 19

ఓ కృష్ణా! యమునానదిలో జలకాలాడుతున్న గోపికల చీరలను దొంగిలించి నేర్పుతో వారికి జ్ఞానోదయమును కలుగజేసిన నీ గొప్పతనమేమని పొగడుదును.

క. దేవేంద్రుఁడలుకతోడను
వావిరిగా ఱాళ్ళవాన వడి గురియింపన్
గోవర్ధనగిరి యెత్తితి
గోవుల గోపకుల గాచుకొఱకై కృష్ణా! 20

ఓ కృష్ణా! దేవేంద్రుడు మిక్కిలి కోపించి గోపాలురపై అతి శీఘ్రముగా భయంకర రాళ్ళ వర్షమును కురిపింపగా ఆ గోవులను, గోపాలురను కాపాడుటకై చిటికిన వ్రేలితో గోవర్ధన పర్వతమును ఛత్రమువలె నెత్తిన నీ సామర్థ్యము నేనేమని పొగడ గలను.

క. అండజవాహన విను బ్ర
హ్మాండంబులఁ బంతులపట్ల యాడెడు నీ వా
కొండల నెత్తితి వందురు
కొండికపనిగాక దొడ్డకొండా కృష్ణా! 21

ఓ కృష్ణా! బ్రహ్మాండ లోకములను బంతులవలె నాడెడు నీవు మందర, గోవర్ధన పర్వతము నెత్తితివి అనుట విడ్డూరమా!

క. అంసాలంబిత కుండల
కంసాంతక! నీవు ద్వారకాపురిలోనన్
సంసారిలీతి నుంటివి
హంసేంద్ర! విశాలనేత్ర అచ్యుత కృష్ణా! 22

ఓ కృష్ణా! కంసుని చంపినవాడా! నీ వేలాడు కర్ణాభరణాలు సర్వాంగ శోభితాలు. విశాలనేత్రా!అచ్యుతా! అట్టి నీవు ద్వారకాపురిలో సాధారణ సంసారివలెనుంటివి.

క. పదియాఱువేల నూర్వురు
సుదతులు యెనమండ్రు నీకు సొంపుగ భార్య
ల్విదితంబుగ బహురూపుల
వదలక రమియింతువౌర వసుధను కృష్ణా! 23

శ్రీహరీ! కృష్ణావతారములో పదహారువేల నూర్గురు గోపికలను, అష్టభార్యలను సుఖించి తృప్తిపరచిన నీ మహిమ అత్యంత అద్భుతము కదా!

క. అంగన పనుపున ధోవతి
కొంగున నటుకులను ముడుచుకొని వచ్చిన యా
సంగతి విని దయనొసఁగితి
రంగున సందపలు లోకరక్షక కృష్ణా! 24

ఓ లోకరక్షక కృష్ణా! భార్య పంపగా నీ బాల్యమిత్రుడు కుచేలుడు నీ దర్శనార్థమై వచ్చి, నీకు ఏ కానుక నియ్యలేక, కొంగుననున్న అటుకులనియ్యక సిగ్గు వహించు చుండగా నీవు ఆ అటుకుల నారగించి యాతని మదినెఱిగి సంపదలిచ్చితివి.

క. హా వసుదేవ కుమారక
కావుము నా మాన మనుచు కామిని వేడన్
ఆ వనజాక్షికి నిచ్చితి
శ్రీ వర! యక్షయ మటంచు చీరలు కృష్ణా! 25

దీనజనరక్షకా! కృష్ణా! వసుదేవకుమారా! 'నా మానమును కాపాడమని ప్రార్థించిన ద్రౌపదికి అక్షయముగ చీరలిచ్చి కాపాడిన దయానిధీ నీకిదే నా నమస్కారములు.

క. శుభ్రమగు పాంచజన్యము
అభ్రంకష మగుచు మ్రోవ నాహవ భూమిన్
విభ్రమలగు దనుజసుతా
గర్భంబుల పగులజేయు ఘనుఁడవు కృష్ణా! 26

ఘనకీర్తిగల కృష్ణా! యుద్ధభూమిలో నీ పాంచజన్య శంఖారావము ఆకాశము వరకు వ్యాపించి భీకరధ్వని చేయగా ఆ ధ్వనికి త్రుళ్లిపడిన రాక్షసస్త్రీల గర్భములు బ్రద్దలయ్యెను గదా! నీవెంత ఘనుడివి.

క. జయమును విజయున కియ్యవె
హయముల ములుకోల మోపి యదలించి మహా
రయమున రొప్పవె తేరున
భయమున రిపుసేన విఱిగి పాఱగ కృష్ణా! 27

ఓ కృష్ణా! కౌరవసేన నీ సారథ్యమును చూసి భయపడి పారిపోయేటట్లు నీవు అర్జునునికి రథసారథివై అత్యంత వేగముతో రథమును తోలి విజయము సాధించునట్లు సాయపడితివి గదా!

క. దుర్జనులగు నృపసంఘము
నిర్జింపఁగదలచి నీవు నిఖిలధారా
దుర్జనులను వధియింపను
నర్జునునకు నీవు సారధైతివి కృష్ణా! 28

సమస్త ఆధారభూతుడవైన ఓ కృష్ణా! దుర్జనులైన దుర్మార్గరాజ సమూహములను నిర్మూలించుటకై సన్మార్గుడైన అర్జునునకు సారథివైతివి.

క. శక్రసుత గాచుకొఱకై
చక్రము చేపట్టి భీష్మ జంపఁగ జను నీ
విక్రమ మేమని పొగడుదు
సక్రగ్రహ సర్వలోకనాయక కృష్ణా! 29

ఓ కృష్ణా! కురుక్షేత్రసంగ్రామములో భీష్మాచార్యుని ధాటికాగలేక అర్జునుడు భీతిల్లు సమయములో నీవు చక్రమును చేత ధరించి భీష్మునిపై నీవు చూపిన పరాక్రమ మును వర్ణించ నలవికాదు.

క. దివిజేంద్రసుతుని జంపియు
రవిసుతు రక్షించినావు రఘురాముఁడవై
దివిజేంద్రసుతుని గాచియు
రవిసుతు బరిమార్చితౌర రణమున కృష్ణా! 30

ఓ కృష్ణా! రామావతారములో ఇంద్రసుతుడైన వాలిని చంపి సూర్యసుతుడైన సుగ్రీ వుని రక్షించినావు. ఇప్పడు కృష్ణావతాములో సూర్యసుతుడైన కర్ణుని చంపించి ఇంద్రసుతుడర్జునుని కాపాడినావు. ఇది ఎంత ఆశ్చర్యకరము కృష్ణా! ఈ ధర్మసూక్ష్మ మును గ్రహించ మేమెంతవారము.

క. దర్భరబాణము రాఁగా
గర్భములోనుండి యభయ గావుమటన్నన్
నిర్భర కృప రక్షించితి
వర్భకు నభిమన్యుసుతుని నచ్యుత కృష్ణా! 31

ఘనకీర్తి వహించిన కృష్ణా! అశ్వత్థామ బ్రహ్మాస్త్రమును ఉత్తర గర్భవిచ్ఛిత్తికై విడు వగా ఆ గర్భస్థశిశువగు పరీక్షిత్తుని రక్షింపుమని వేడుకొనగా అభయమిచ్చి రక్షించి కాపాడిన అభయప్రదాతవు నీవే కదా!

క. గిరులందు మేరువౌదువు
సురలందున నింద్రుఁడౌదు చుక్కలలోనన్
బరమాత్మ చంద్రుఁడౌదువు
నరులందున నృపతివౌదు నయముగ కృష్ణా! 32

ఓ కృష్ణా! నీవు కొండలలో మేరుపర్వతము వంటివాడివి. చుక్కలలో చంద్రుడవు. దేవతలలో ఇంద్రుడవు. నరులకు రాజువు.

క. చుక్కల నెన్నగవచ్చును

గ్రక్కున భూరేణువులను గణుతింపనగున్
జొక్కపు నీ గుణజాలము
నక్కజమగు లెక్కపెట్ట నజునకు కృష్ణా! 33

ఓ శ్రీకృష్ణా! ఆకాశంలో నక్షత్రములను, భూమిపై ధూళిరేణువులను, లెక్కపెట్టవచ్చునే మోగాని నీ సద్గుణములెక్కపెట్ట బ్రహ్మకైననూ తరముగాదు మేమెంత తండ్రీ!

క. కుక్షిని సకల జగంబులు
నిక్షేపము జేసి ప్రళయనీరధి నడుమన్
రక్షక వటపత్రముపై
దక్షత పవళించునట్టి ధన్యుఁడ కృష్ణా! 34

ఓ కృష్ణా! జగద్రక్షకా! సమస్తలోకాలను బొజ్జలో నింపుకొన్న వాడా! మహాప్రళయ మందు మహాసముద్రమున నొక మఱ్ఱియాకుపై పవ్వళించిన వాడా!

క. విశ్వోత్పత్తికి బ్రహ్మవు
విశ్వము రక్షింపదలచి విష్ణుఁడ వనగా
విశ్వము జెరుపన హరుఁడవు
విశ్వాత్మక నీవె యగుదు వెలయఁగ కృష్ణా! 35

లోకాలన్నింటిని సృష్టించే బ్రహ్మవు నీవు. రక్షించే విష్ణుమూర్తివి నీవు. లయమును చేసే నీశ్వరుడవూ నీవే. అంతయూనీవే! అన్నియునీవే! కృష్ణా.

క. అగణితవైభవ కేశవ
నగధర వనమాలి యాదినారాయణ యో
భగవంతుఁడ శ్రీమంతుడ
జగదీశ్వర శరణు శరణు శరణము కృష్ణా! 36

గణించనలవికాని వైభవముకల ఓ కేశవా! గిరిధారీ! వనమాలీ! ఓ ఆదినారాయణా! జగదీశ్వరా! ఐశ్వర్యమంతుడా! శ్రీకృష్ణా! ముమ్మాటికీ నీవె మాకు శరణు! శరణు!

క. మగమీనమవై జలధిని
పగతుని సోమకుని జంపి పద్మభవునకు

న్నిగమముల దెచ్చియిచ్చితివి
సుగుణాకర! మేలు దివ్యసుందర కృష్ణా! 37

ఓ కృష్ణా! త్రేతాయుగములో మత్స్యావతారమెత్తి సోమకాసురుని జంపి, వేదాల్ని రక్షించి బ్రహ్మదేవుని కిచ్చిన సుగుణాకరుడవు! మేలు దివ్యసుందరుడవు నీవు.

క. అందఱు సురలును దనుజులు
పొందుగ క్షీరాబ్ధి దఱవ పొలుపున నీ వా
నందముగ కూర్మరూపున
మందరగిరి యెత్తితౌర మాధవ కృష్ణా! 38

ఓ లక్ష్మీపతీ! శ్రీకృష్ణా! దేవతలు, రాక్షసులు పాలసముద్రమున చిలికినపుడు నీవు కూర్మావతరమెత్తి తాబేలు రూపమున మంధరగిరి నెత్తి సహాయపడ్డావు.

క. ఆదివరాహుఁడవయి నీ
వా దనుజ హిరణ్యనేత్రు హతుతజేసి తగన్
మోదమున సురలు బొగడఁగ
మేదిని గిరి గొడుగునెత్తి మెఱసితి కృష్ణా! 39

వరాహరూపమునునెత్తి, హిరణ్యాక్షుడను రాక్షసుని జంపి రసాతలములో మునిగి పోతున్న భూలోకమును నీ కోరలతో పైకెత్తి కాపాడినవాడవు.

క. కెరలి యఱచేత కంబము
నరుదుగ వేయుటను వెడలి యసురేశ్వరునిన్
ఉదరము జీరి వధించితి
నరహరి రూపావతార నగధర కృష్ణా! 40

ఓ కృష్ణా! నీవు నరశింహావతారమెత్తి ఉగ్రనరశింహుడవై హిరణ్యకశిపుడనే రాక్షసుని కడుపు చీల్చి సంహరించినవాడవు.

క. వడుగుఁడవై మూఁడడుగుల
నడగితివౌ భళిర భళిర, యఖిల జగంబుల్
తొడిగితివి నీదు మేనున
గడు చిత్రము నీ చరిత్ర ఘనమగు కృష్ణా! 41

నీవు వామనావతారము దాల్చి బలిచక్రవర్తిని మూడడుగుల నేలనిమ్మని అడిగి సమస్తలోకాల్ని రెండు అడుగులలో నాక్రమించి మూడవ అడుగుని బలిచక్ర వర్తి తలపైనుంచి పాతాళమునకణగద్రొక్కిన ఘనుడవు. నీ ఘనచరిత్ర చాల చిత్రము.

క. ఇరువ దొకమారు నృపతుల
శిరములు ఖండించితౌర చేగొడ్డంటన్
ధర గశ్యపునకు నిచ్చియు
బరగవె జగదగ్ని రామభద్రుడఁ కృష్ణా! 42

ఓ కృష్ణా! నీవు పరశురామావతారమెత్తి గండ్రగొడ్డలితో ఇరవై ఒక్కమార్లు రాజుల నందరిని దునుమాడితివి. కశ్యపునికి భూమి నంతను ధారవోసి సముద్రపు టొడ్డున క్రొత్తగా కొంచెము నేలను సంపాదించి తపస్సు చేసుకొంటివి.

క. దశకంఠుని బరిమార్చియు
కుశలముతో సీత దెచ్చికొనియు సయోధ్య
న్విశదముగ కీర్తి నేలితి
దశరథరామావతార ధన్యుడ కృష్ణా! 43

ఓ కృష్ణా! నీవు శ్రీరామావతారములో దశకంఠని జంపి నీ భార్య సీతను దెచ్చు కొని అయోధ్యను ఘనమగు ఎనలేని కీర్తితో పరిపాలించితివి.

క. ఘనులగు ధేనుక ముష్టిక
దనుజుల చెండాడితౌర తగ భుజశక్తిన్
అనఘాత్మ! రేవతీపతి
యనఁగా బలరామమూర్తి వైతివి కృష్ణా! 44

ఓ కృష్ణా! నీవు గొప్పభుజబలము కల్గిన ధేనుకాసురుని, ముష్టికాసురుని, వధించి నావు. పాపాలను పొగొట్టే ఓ శ్రీహరీ! రేవతీపతివై బలరామ మూర్తివైనావు.

క. త్రిపురాసుర భార్యల నతి
నిపుణతతో వ్రతముచేత నిలిపిన కీర్తుల్
కపటపు రాజవు భళిరే

కృపగల బౌద్ధావతార ఘనుడవు కృష్ణా! 45

దయార్ద్రుడవై బౌద్ధావతారుడవైన ఘనమగు కృష్ణా! త్రిపురాసుర భార్యలను వ్రతముచేత నిపుణతతో కీర్తివంతులుగా చేసిన బుద్ధదేవుడవు నీవే. భళీరే! కపట రాజువై వారి కీర్తిని నిలిపావు..

క. వలపుల తేజీ నెక్కియు
నిలపై ధర్మంబు నిలుప హీనుల దునుమన్
గలియుగము తుదిని వేడుక
కలికివిగా నున్న లోకకర్తవు కృష్ణా! 46

ఓ కృష్ణా! దుష్టశిక్షణ, శిష్టరక్షణకై భూలోకములో కలియుగాంతమున గుఱ్ఱము నెక్కి వచ్చే కల్కిమూర్తివి నీవే సుమా!

క. వనజాక్ష భక్తవత్సల
ఘనులగు త్రైమూర్తులందు కరుణానిధివై
మను నీ సద్గుణజాలము
సనకాది మునీంద్రు లెన్నజాలరు కృష్ణా! 47

వనజాక్ష ! భక్తవత్సలా! త్రిమూర్తులైన బ్రహ్మావిష్ణు మహేశ్వరులను నీ బొజ్జ లోనిడుకొని కరుణానిధివై యొప్పు కృష్ణా! నీ గొప్పతనము సనక సనందనాది మునులు గూడ తెలిసికోలేరు, నేనెంత స్వామీ!

క. అపరాధసహస్రంబుల
నపరిమితములైన యఘము లనిశము నేనుం
గపటాత్ముఁడవై జేసితి
చపలుని ననుగావు శేషశాయివి కృష్ణా! 48

ఓ శేషశయనా! శ్రీకృష్ణా! నేను కపటాత్ముడనై ఘోరపాపము లనేకములుగా చేసియున్నాను. చంచల స్వభావసిద్ధుడనగునన్ను దయతో కాపాడుము.

క. నరపశువు మూఢచిత్తుఁడ
దురితారంభుఁడను మిగుల దోషగుఁడను నీ
గుణు తెఱుఁగ నెంతవాడను

హరి నీవే ప్రాపుదాపు నౌదువు కృష్ణా! 49

ఓ శ్రీకృష్ణా! నేను నరపశువును. మూఢచిత్తుడు.తెలిసియో తెలియకయో అనేక పాపములు చేసినవాడను. నిన్ను తెలుసుకొనుట నా తరమా! నీవే నాకాధారము. పొందదగినవాడవు.

క. పరనారీ ముఖపద్మము
గుఱుతగు కుచకుంభములను గొప్పను నడుమున్
అరయంగనె మోహింతురు
నిరతము నిను భక్తిగొల్వ నేరరు కృష్ణా! 50

క్షణభంగురమైన సుఖభోగాలకు లోబడి అందమైన సుందరాంగి కుచకుంభము లను చూడగానే మోహించే ఈ మూఢజనులు నీ యందు మనసు నిల్పి నిన్ను పూజింపరుగదా! ఎంత అవివేకులీ జనులు.

క. పంచేంద్రియ మార్గంబుల
కొంచెం బుద్ధిని చరించి కొన్ని దినంబుల్
ఇంచుక సజ్జన సంగతి
నెంచగ మిమ్మెరిగినాఁడ నిప్పుడె కృష్ణా! 51

ఓ కృష్ణా! నేనిదివరకు ఇంద్రియలకువశుడై, అజ్ఞానినై మెలగితిని. కాని సజ్జన సాంగత్యమున నిప్పుడిప్పుడే నిన్ను తెలుసుకొంటున్నాను.

క. దుష్టుండ ననాచారుఁడ
దుష్టచరిత్రుఁడను చాల దుర్బుద్ధిని నే
నిష్ఠ నిను గొల్వనేరని
కష్టుఁడ నను గావు కావు కరుణను కృష్ణా! 52

ఓ కృష్ణా! నేను దుష్టుడను! అనాచారిని, దుష్టచరిత్రుడను, దుర్బుద్ధితోనున్నవాడను, నియమనిష్ఠలతో నిన్ను కొల్వలేనివాడను. కరుణతో నన్ను కావుము కృష్ణా!

క. కుంభీంద్రవరద కేశవ
జంభాసురవైరి దివిజసన్నుత చరితా

అంభోజనేత్ర జలనిధి
గంభీరా నన్ను గావు కరుణను కృష్ణా! 53

కృష్ణా! కేశవా! నీవు గజేంద్రునికాపాడినవాడవు. జంభాసురునకు శత్రువైనవాడా! దేవతలచే కొనియాడబడిన ఘనచరిత్రకలవాడా! తామరపద్మము లవంటి నేత్రములు కలవాడా! జలనిధి గంభీరా! దయతోనన్ను బ్రోవుమయ్య తండ్రీ!

క. దిక్కెవరు ప్రహ్లాదుకు
దిక్కెవ్వరు పాండుసుతుల దీనుల కెపుడు
న్దిక్కెవ్వర య్యహల్యకు
దిక్కెవ్వరు నీవె నాకు దిక్కువు కృష్ణా! 54

ప్రహ్లాదునకు, పాండవులకు! దీనులకు, అహల్యకు దిక్కై బ్రోచిన పరమాత్మయెవ్వరో అట్టి కృష్ణా! నీవే నాకు దిక్కు సుమా!

క. హరి! నీవె దిక్కు నాకును
సిరితో నేతెంచి మకరి శిక్షించి దయన్
బరమేష్ఠి సురలు బొగడగ
కరిగాచినరీతి నన్ను గావుము కృష్ణా! 55

ఓ శ్రీహరీ! నీవే నాకు దిక్కు. బ్రహ్మాది దేవతలు స్తుతించుచుండగా లక్ష్మీదేవితో గూడి మొసలిని చంపి గజేంద్రుని రక్షించిన విధమున నన్నుగూడ కాపాడుము స్వామీ.

క. పురుషోత్తమ లక్ష్మీపతి
సరసిజ గర్భాదిమౌని సన్నుత చరితా
మురభంజన సుర రంజన
వరదుఁడవగు నాకు భక్తవత్సల కృష్ణా! 56

పురుషోత్తమ! ఓ లక్ష్మీపతీ! భ్రక్తవత్సలా! బహ్మాదిమునులచే కొనియాడబడిన వాడా! మరహరీ! దేవతాప్రియా! నాకు వరములిచ్చి కాపాడుము.

క. క్రతువులు తీర్థాగమములు

వ్రతములు దానములు సేయవలెను లక్ష్మీ
పతి ! మిము దలఁచినవారికి
నతులిత పుణ్యములు గలుగుటరుదా కృష్ణా! 57

ఓ కృష్ణా! లక్ష్మీపతీ! నిన్ను సేవించినంతనే యజ్ఞయాగాదిక్రతువు. తీర్థస్నాన, వేదపారాయణ, వ్రతదానములు మొదలగు పుణ్యకార్యములవలన చేసిన ఫలము లభించుచుండగా మరల వేరే వాటిని చేయుట ఎందులకు?

క. స్తంభమున వెడలి దానవ
డింభకు రక్షించునట్టి రీతిని వెలయన్
అంభోజనేత్ర జలనిధి
గంభీరుఁడ నన్నుగావు కరుణను కృష్ణా! 58

సముద్రమువంటి గంభీరమైన మనస్సు కల్గినవాడా! తామరపువ్వుల వంటి నేత్ర ములు కలవాడా! కృష్ణా! నీవు నరశింహావతారములో స్తంభము నుండి వెడలి ప్రహ్లాదుని కాపాడినట్టుగా నన్నుగూడా దయతో కాపాడుము తండ్రీ!

క. శతకోటి భాను తేజా
యతులిత సద్గుణగణాఢ్య యంబుజనాభా
రతినాథజనక లక్ష్మీ
పతిహిత నను గావు భక్త సన్నుత కృష్ణా! 59

శతకోటి సూర్యకిరణాల తేజస్సుతో వెలుగొందువాడా! సాటిలేని సద్గుణసంపన్నా! తామరపూవు నాభియందు కలవాడా! మన్మథుని తండ్రివైన ఓ కృష్ణా! లక్ష్మీపతీ! భక్తులచే కొనియాడబడు శ్రీకృష్ణా నన్ను దయతో కాపాడుము స్వామీ.

క. మందుఁడ నీ దురితాత్ముఁడ
నిందల కొడిగట్టినట్టి నీచుని నన్నున్
సందేహింపక కావుము
నందునివరపుత్ర నిన్ను నమ్మితి కృష్ణా! 60

ఓ శ్రీకృష్ణా! పరమాత్మా! నందకుమారా! చెడ్డ మనసుతో మందులమై మేము చేసిన నిందా తిరస్కార దూషణములెల్లను మంచి మనస్సుతో

కాచి, మమ్ములను తరింపజేయుము.

క. గజరాజ వరద కేశవ
త్రిజగత్కల్యాణమూర్తి దేవ మురారీ
భుజగేంద్ర శయన మాధవ
విజయాప్తుఁడ నన్ను గావు వేగమె కృష్ణా! 61

ఓ కేశవా! జనార్ధనా! గజేంద్రుని రక్షించి వరములిచ్చి కాపాడితివి. ముల్లోకాలకు శుభాలిచ్చే మూర్తి ! ఓ దేవా! మురారీ! శేషశయనా! ఓ మాధవా! అర్జునుని ప్రియ బాంధవుడా! రాక్షస సంహారీ! నన్ను త్వరగా కాపాడుము తండ్రీ!

క. గోపాల దొంగ మురహర
పాపాలను పాఱఁదోలు ప్రభుడఁవు నీవే
గోపాలమూర్తి దయతో
నాపాలిట గలిగి ప్రోవు నమ్మితి కృష్ణా! 62

ఓ గోపాలా! మురహరీ! శ్రీకృష్ణా! మా పాపములను బ్రోచే విభుడవు నీవే! నా యందు దయవుంచి కాపాడుము. నిన్నే నమ్మితిని ప్రభూ!

క. దుర్మతిని మిగుల దుష్టవు
కర్మంబులు జేసినట్టి కష్టుఁడ నన్నున్
నిర్మలుని జేయవలె ని
ష్కర్ముఁడ నిను నమ్మినాను నిజముగ కృష్ణా! 63

ఓ కృష్ణా! దుర్మతిని చెడ్డ పనులను చేసి అందరినీ బాధపెట్టియున్నాను. ప్రస్తుతము నేను సన్యసించి, మౌనము వహించి యే కర్మలను చేయక సద్బుద్ధితోయున్నాను. నిన్నే సత్యమని నమ్మియుంటిని. పాపరహితునిగా జేసి నన్ను బ్రోవుమని వేడుకొను చున్నాను స్వామీ.

క. దుర్వార చక్రధరకర
శర్వాణీభర్తృవినుత జగదాధారా
నిర్వాణనాథ మాధవ
సర్వాత్మక నన్నుగావు సరగున కృష్ణా! 64

అతిపరాక్రమమైన చక్రమును చేత ధరించిన ఓ శ్రీకృష్ణా! ఈశ్వరునిచే నుతించ బడినవాడా! జగదాధార! లోకప్రభూ! మాధవా! సర్వాత్మకా! శ్రీకృష్ణా! త్వరగా నన్ను బ్రోవుము తండ్రీ!

క. సుత్రామనుత జనార్దన
సత్రాజిత్త నయనాథ సౌందర్య కళా
చిత్రావతార దేవకి
పుత్రా ననుగావు నీకు పుణ్యము కృష్ణా! 65

ఓ జనార్దనా! కృష్ణా! ఇంద్రునిచే కొనియాడబడినవాడా! సత్రాజిత్తు కూతురైన సత్య భామ పతియైనవాడా! దేవకీసుతా! నీకు పుణ్యముండును, నన్ను రక్షింపుము.

క. బలమెవ్వఁడు కరి బ్రోవను
బలమెవ్వఁడు పాండుసుతుల భార్యను గావన్
బలమెవ్వఁడు సుగ్రీవునకు
బలమెవ్వఁడు నాకు నీవె బలమౌ కృష్ణా! 66

గజేంద్రుని కాపాడిన బలమేదో, పాండవుల పత్నియైన ద్రౌపదిని బ్రోచిన బలమేదో, సుగ్రీవునకు బలమెవ్వడో, ఓ కృష్ణా! నీవే నాకు అండ దండ.

క. పరుసము సోకిన యినుమును
వరుసగ బంగారమైన వడుపున జిహ్వన్
హరి నీ నామము సోకిన
సురవందిత నేను నటుల సులభుండ కృష్ణా! 67

దేవతలచే నుతింపబడినవాడా! ఓ కృష్ణా! స్పర్శవేధి సోకినంతనే ఇనుము కూడా బంగారమైన విధంబున ఓ శ్రీహరీ! నీ నామము మా నాలుకకు తగిలినంతనే మోక్షప్రాప్తిని పొందుదము.

క. ఒకసారి నీదునామము
ప్రకటముగా దలఁచువారి పాపము లెల్లన్
వికలములై దొలఁగుటకును
సకలార్థ యజామిళుండు సాక్షియె కృష్ణా! 68

ఓకృష్ణా! నీ నామం స్మరించినంత మాత్రముననే భక్తుల పాపములెల్లను హరించి పోవుననుటకు అజామిళుండే మాకు సాక్షి

క. హరి సర్వంబున గలడని
గరిమను దైత్యుండు బలుక కంబములోనన్
యిరవొంది వెడలి చీల్చవె
శరణను ప్రహ్లాదుడిందు సాక్షియె కృష్ణా! 69

శ్రీహరి సర్వాంతర్యామి ఎల్లెడలా కలడాయని గర్వముతో పలికిన రాక్షసుని అతను చూపుమన్న స్థంభమునుండి వెలువడి యాతని గర్వమడంచి, సంహరించి, ప్రహ్లాదుని కాపాడితివి ఓ కృష్ణా! అందుకు ప్రహ్లాదుడే నీకు సాక్షి

క. భద్రార్చిత శుభచరణ సు
భద్రాగ్ర సర్వలోకపాలన హరి! శ్రీ
భద్రాధిప కేశవ బల
భద్రానుజ నన్ను బ్రోవు భవహర కృష్ణా! 70

ఓ కృష్ణా! శుభమంగళార్చిత పాదపద్మయుగళా! సుభద్రాదేవి సోదరుడా! ఓ హరీ! సర్వలోకపరిపాలకా! బలభద్రుని సోదరుడా! ఈ సంసారభవ బంధములనుండి రక్షించుము స్వామీ!

క. ఎటువలె కరిమొఱ వింటివి
ఎటువలె ప్రహ్లాదు కభయమిచ్చితి కరుణన్
అటువలె నను రక్షింపుము
కటకట నిను నమ్మినాఁడఁ గావుము కృష్ణా! 71

ఓ కృష్ణా! ఎలా నిన్నే నమ్మిన గజేంద్రుని మొర విన్నావో, ప్రహ్లాదునికి అభయమిచ్చి ఎట్లు రక్షించితివో అట్లే నన్ను గూడా రక్షింపుము. మనస్ఫూర్తిగా నిన్ను మాత్రమే నమ్మియున్నాను తండ్రీ!

క. తట తట లేటికి జేసెదు
కటకట పరమాత్మ నీవు ఘంటాకర్ణన్

ఎటువలె నిపుణుని జేసితి
వటువలె రక్షింపుమయ్య యచ్యుత కృష్ణా! 72

కృష్ణా! నన్నేల దుఃఖపెట్టెదవు, పూర్వము ఘంటాకర్ణుడను వాని నెటు నేర్పరిని జేసి తివో యటు నన్నుగూడ చల్లగా కాపాడుము తండ్రీ!

క. తురగాధ్వరంబు జేసిన
పురుషులకును వేఱెపదవి పుట్టుటయోమో
హరి మిము దలచిన వారికి
నరుదా కైవల్యపదవి యచ్యుత కృష్ణా! 73

ఓ అచ్యుతా! కృష్ణా! శ్రీహరీ! ప్రశస్తమయిన అశ్వమేధయాగఫలమునకు సరిపడు ఫలము ఉండునో లేదోకాని పరమేశ్వరుడవైన నిన్ను తలచినవారికి మోక్షప్రాప్తి కలుగుననుటలో సందేహము లేదు.

క. ఓ భవబంధ విమోచన
ఓ భరతాగ్రజ మురారి యో రఘురామా
ఓ భక్త కామధేనువ
ఓ భయహర నన్నుగావు మో హరి కృష్ణా! 74

భవబందాలనుండి విమోచనము కలిగించు వాడా! ఓ కృష్ణా పరమాత్మా! భరతు నికి అన్నయైన ఓ శ్రీరామా! మురుడనే రాక్షసుని సంహరించిన ఓ మురారీ! ఓ ర ఘురామా! భక్తులకు కామధెనువు వంటివాడా! మా భయమును పోగొట్టే ఓ హరీ! శ్రీకృష్ణా! నన్ను రక్షింపుము.

క. ఏ తండ్రి కనక కశ్యపు
ఘాతకుడై యతనిసుతుని కరుణనుగాచెన్
బ్రీతిసురకోటి బోగడగ
నా తండ్రీ నిన్ను నేను నమ్మితి కృష్ణా! 75

ఓ శ్రీకృష్ణా! దేవతా సమూహము ప్రీతితో నిన్ను కీర్తించుచుండగా రాక్షసుడైన ప్రహ్లాదుని దండ్రి హిరణ్యకశిపుని వధించి యాతని బారినుండి ప్రహ్లాదుని దయతో గాచిన ఓ తండ్రీ! నిన్నే నమ్మియుంటిని. దయతో కావుము కృష్ణా!

క. ఓ పుండరీక లోచన
యో పురుషోత్తమ ముకుంద యో గోవిందా
యో పురసంహర మిత్రుడ
యో పుణ్యుఁడ నన్ను బ్రోవుమో హరి కృష్ణా! 76

తెల్లతామరవంటి కన్నులగల ఓ శ్రీకృష్ణా! పురుషోత్తమా! ముకుందా! గోవిందా! ఈశ్వర ప్రియసఖుడా! ఓ పుణ్యాత్మా! పాపమును పోగొట్టే శ్రీహరీ నన్ను బ్రోవుము.

క. ఏ విభుడు ఘోరరణమున
రావణు వధియించి లంకరాజుగ నిలిపెన్
దీవించియూ విభీషణు
నా విభు నే దలఁతు మదిని నచ్యుత కృష్ణా! 77

ఓ అచ్యుతా శ్రీకృష్ణా! పరమేశ్వరా! నీవు రామావతారములో భయంకర యుద్ధమున రావణుని చంపి అతని తమ్ముడు విభీషణుని ఆశీర్వదించి లంకకు రాజుగా చేసితివి. అట్టి కృష్ణా! సదా నిన్ను నా మనస్సునందే నిల్పికొలుతును.

క. గ్రహభయ దోషము లొందవు
బహుపీడలు చేర వెఱచు పాయును నఘముల్
ఇహపర ఫలదాయక విను
తహ తహ లెక్కడివి నన్ను దలచిన కృష్ణా! 78

బ్రతికియున్నంతకాలము ఇహ లోకములోనూ, చచ్చిన తర్వాత పరలోకములోను సుఖములనొసగే ఓ కృష్ణా! ఏ నామమును తలంచినంతనే భూత, ప్రేత, పిశాచ, బ్రహ్మరాక్షసులు దరిజేరవో, దుఃఖములు కలుగవో, పాపములు అంటవో గాలి పీడలు కలుగవో అట్టి నిన్ను ఎలప్పడు నా మనస్సునందే నిల్పి పూజింతును తండ్రీ!

క. గంగ మొదలైన నదులను
మంగళమున జేయునట్టి మజ్జనములకున్
సంగతి గలిగిన ఫలములు
రంగుగ మిము దలచు సాటిరావుర కృష్ణా! 79

ఓ కృష్ణా! పవిత్రమయిన గంగ, యమున, సరస్వతి, బ్రహ్మపుత్ర, కృష్ణా, గోదావరి నదులందు మునిగిన కలుగు పుణ్యఫలములు నీ నామస్మరణము వలన వచ్చే పుణ్యఫలములతో సాటిరావు.

క. ఆ దండకా వనంబున
కోదండము దాల్చినట్టి కోమలమూర్తి
నాదండ గావ రమ్మీ
వేదండము కాచినట్టి వేలుప కృష్ణా! 80

ఓ శ్రీకృష్ణా! దండకారణ్యములో కోమల కోదండమూర్తివై, పితృవాక్యపరిపాలకుడవై, రాక్షసులను చంపి, అనేక కష్టములు చవిచూసిన ఓ శ్రీహరీ! కృష్ణా! గజేంద్రుని కాపాడుటకు వైకుంఠమునుండి ఆఘమేఘాలమీద వచ్చి కాపాడావు. అట్లే నన్ను గూడ త్వరగా ఈ భవబంధముల నుండి రక్షించి మోక్షాన్ని ప్రసాదించు తండ్రీ!

క. చూపుము నీ రూపంబును
పాపపు దుష్కృతములెల్ల పంకజనాభా
పాపుము నాకును దయతో
శ్రీపతి నిను నమ్మినాడ సిద్ధము కృష్ణా! 81

ఓ శ్రీకృష్ణా! పంకజనాభా! విష్ణుమూర్తీ! నీ దివ్యస్వరూపమును నా కొక్కసారి చూపుము. అజ్ఞాన తిమిరములో మునిగి నేజేసిన చెడ్డకార్యములన్నింటిని దయతో పోగొట్టుము. శ్రీపతీ! ఎల్లప్పుడు నా మనస్సునందు నిన్నే నమ్మినాడను. నిజమిది.

క. నీ నామము భవహరణము
నీ నామము సర్వసౌఖ్యనివహకరంబు
న్నీ నామ మమృత పూర్ణము
నీ నామము నే దలంతు నిత్యము కృష్ణా! 82

ఓకృష్ణా! నీ నామము సంసారదు:ఖములను హరిస్తుంది, సర్వసౌఖ్యములనిస్తుంది. నీ నామము అమృతముతో నిండియున్నది.అట్టి నీ నామమునే సదా స్మరింతును.

క. పరులను నడిగిన జనులకు

కురుచసుమీ యిదియటంచు గఱుతుగ నీవు
న్గురుచడవై వేడితి ముసు
ధర బాదత్రయము బలిని తద్దయు కృష్ణా! 83

ఓ కృష్ణా! అవసరార్థము ఇతరులను యాచించుటలో తప్పులేదన లోకమునకు తెలిసేటట్లు నీవు వామనావతారుడవై బలిని మూడడుగుల నేల నడిగి మంచిని రక్షించితివి.

క. పాలను, వెన్నయు మ్రుచ్చిల
రోలను మీ తల్లిగట్ట రోషముతోడన్
లీలావినోది వైతివి
బాలుడవా బ్రహ్మగన్న ప్రభుడవు కృష్ణా! 84

ఓ కృష్ణా! నీ బాల్యచేష్టలు మిక్కిలి ప్రశంసములు, సందర్భ సహితము. నీ చిన్నతనములో నీవు పాలు వెన్న దొంగిలించగా నీ తల్లి నిన్ను ఱోటికి కట్టివేయగా లీలా వినోదివై నొక సత్కార్యము చేసి చూపెడితివి. నీవు బాలుడివా కృష్ణా! కాదు బ్రహ్మ దేవుని కన్న శ్రీహరివే!

క. రఘునాయక నీ నామము
లఘుమతితో దలచగలనె లక్ష్మిరమణా
యఘములు బాపుదు దయతో
రఘురాముడవైన లోకరక్షక కృష్ణా! 85

రఘునాయక! లోకరక్షకా! నీ నామము తలచినంతనే పాపములు బాపే లక్ష్మి రమణా! దయామూర్తివై నన్ను కాపాడుము. ఇదే నిన్ను సేవించుచున్నాను.

క. అప్పా యిత్తువు దయతో
నప్పాలను నతిరసంబు ననుభవశాలీ
యప్పాలను గనుగొనవే
యప్పానను బ్రోవు వేంకటప్పా కృష్ణా! 86

ఓ తండ్రీ! శ్రీకృష్ణా! దయతో మాకు అప్పముల ప్రసాదములనొసంగెదవు. అట్లే ప్రేమతో మమ్ము కాపాడుము తండ్రీ!

క. కొంచెపు వాడని మదిలో
నెంచకుమీ వాసుదేవ గోవిందహరీ
యంచితముగ నీ కరుణకు
గొంచెము నధికంబు గలదె కొంతయు కృష్ణా! 87

వాసుదేవా! గోవిందా! శ్రీహరీ! నన్ను అల్పుడనని సందేహించక దయనునాపై కురి
పించి నన్ను కావుము తండ్రీ!

క. వావిరి నీ భక్తులకుం
గావరమున నెగ్గుసేయు గర్వాంధులమున్
దేవ వధించుట వింటిని
నీవల్లను భాగ్యమయ్యె నిజముగ కృష్ణా! 88

ఓ పరమేశ్వరా! కృష్ణా! నీభక్తులకు హానిచేయువారిని సంహరించితివి. నీ వలన
లోకానికంతకూ మేలు కలిగెను. నిజముగా నీవు నీ భక్తుల పాలిట కల్పతరువువి.

క. అయ్యా పంచేంద్రియములు
నయ్యాలల నూచినట్లు లూచగ నేనున్
నీ యాజ్ఞ దలపనేరను
కుయ్యాలింపుము మహాత్మ గుఱుతుగ కృష్ణా! 89

ఓ తండ్రీ శ్రీకృష్ణా! నా పంచేంద్రియములు నా వశము తప్పచున్నవి. నీ యాజ్ఞను
నెరవేర్చలేకున్నాను. గుర్తెరిగి నా మొఱను ఆలకింపుము తండ్రీ!

క. కంటికి రెప్పవిధంబున
బంటుగదా యనుచు నన్ను బాయక యెపుడున్
జంటయు నీ వుండట నే
కంటకమగు పాపములను గడచితి కృష్ణా! 90

ఓ కృష్ణా పరమేశ్వరా! ఈశ్వరా! నీ సేవకుడనైన నన్ను కంటికి రెప్పలాగున కాచి
రక్షించుము తండ్రీ! ఎల్లప్పడు జంటగానాయందుండి నా కష్టములను బాపి రక్షిం
చుము స్వామీ!

క. యమునికి నికనే వెఱవను
కమలాక్ష జగన్నివాస కామితఫలదా
విమలమగు నీదు నామము
నమరగ దలఁచెదను వేగ ననిశము కృష్ణా! 91

ఓ కమలాక్షా! జగన్నివాసా! కోరిన కోరికలు నొసంగే ఓ ప్రభూ! స్వచ్ఛమైన నీ నామ
ము నెల్లప్పుడు పరిశుద్ధాత్మతో స్మరింతును. మృత్యువుకిక భయపడను.

క. దండమయా విశ్వంభర
దండమయా పుండరీకదళ నేత్రహరీ
దండమయా కరుణానిధి
దండమయా నీకు నెపుడు దండము కృష్ణా! 92

హే పరంధామా శ్రీకృష్ణా! వరహావతారంలో సముద్రగర్భమునుండి భూమిని
పైకెత్తి రక్షించినవాడా! తామర రేకుల్లాంటి నేత్రములు గలవాడా! పాపములు
శమింపజేయు ఓకృష్ణా ! నీకు సదా నమస్కారములు.

క. నారాయణ లక్ష్మీపతి
నారాయణ వాసుదేవ నందకుమారా
నారాయణ నిను నమ్మితి
నారాయణ నన్ను బ్రోవు నగధర కృష్ణా! 93

శ్రీమన్నారాయణా! లక్ష్మీపతీ! వాసుదేవా! నందకుమారా! నిన్నే నమ్ముకున్నాను. నన్ను
గావుము కృష్ణా! నన్ను చల్లగా చూడుము తండ్రీ!

క. తిరుమణి దురిత విదూరము
తిరుమణి సౌభాగ్యకరము త్రిజగములందున్
తిరుమణి పెట్టిన మనుజుఁడు
పరమపవిత్రుఁడు భాగ్యవంతుఁడు కృష్ణా! 94

ఓ కృష్ణా! తిరుమణి ధరించినవాని యొక్కపాపములు పోవును, భాగ్యమబ్బును,
పాపరహితుడై, పవిత్రమైన మనస్సుతో ఐశ్వర్యవంతుడవగలడు.

క. సర్వేశ్వర చక్రాయుధ
శర్వాణీవినుతనామ జగదభిరామా
నిర్వాణనాధ మాధవ
సర్వాత్మక నన్నుగావు సదయత కృష్ణా! 95

ఓ సర్వేశ్వరా! చక్రధారీ! పార్వతీదేవిచే స్తుతించబడన నామముగల్గిన ఓ జగద భిరామా! మోక్షాధిపతీ! సర్వాంతర్యామీ నన్ను దయతో కాపాడుము.

క. శ్రీ లక్ష్మీనారాయణ
వాలాయము నిన్ను దలతు వందితచరణా
ఏలుము నను నీ బంటుగ
చాలగ నిను నమ్మినాను సరసుండ కృష్ణా! 96

ఓ లక్ష్మీనారాయణా! సమస్త జనులు కొలిచే సుందరపాద పద్మములుగలవాడా! శ్రీకృష్ణా నా మనస్సు నందెల్లప్పుడూ నిన్నే స్మరించుచున్నాను. నన్ను నీ బంటుగా భావించి ఏలకో శ్రీకృష్ణా!

క. శ్రీధర మాధవ యచ్యుత
భూధర పురుహూతవినుత పురుషోత్తమ నీ
పాదయుగళంబు నెప్పడు
మోదముతో నమ్మినాడ ముద్దుల కృష్ణా! 97

శ్రీధరా! మాధవా! అచ్యుతా! భూధరా! పురుషోత్తమా! నేనెల్లప్పడు నీ పాదపద్మముల నే నమ్మియుంటిని. దయతో నన్ను రక్షింపుము. తండ్రీ!

క. శిరమున రత్నకిరీటము
కరయుగమున శంఖచక్ర ఘణభూషణముల్
ఉరమున వజ్రపుపతకము
సిరినాయక అమరఁదాల్తు శ్రీహరి కృష్ణా! 98

ఓ శ్రీహరీ! కృష్ణా! లక్ష్మీపతీ! తలపై రత్నకిరీటము, కరములందు శంఖ, చక్రము లును, వక్షస్థలమున కౌస్తుభమణియును అలంకారముగా ధరించిన నీ సుందర స్వరూపము ఎంత మనోహరముగా యున్నది.

క. అందెలు పాదములందున
సుందరముగ నుంచినావు సొంపలరంగా
మందరధర ముని సన్నుత
నందుని పరపుత్ర నిన్ను నమ్మితి కృష్ణా! 99

ఓ కృష్ణా! ఇంపుసొంపుగా నీ పాదాబ్జములయందు గజ్జెలు నుంచుకొన్నావు. పర్వతాన్ని అవలీలగా నెత్తిన ఓ చిన్ని కృష్ణా! మునులందరిచే స్తుతింపబడినవాడా! నందకుమారా! నిన్ను నమ్మినాను. నీకిదే నమస్కారము.

క. కందర్పకోటి సుందర
మందరధర నామతేజ మధుసూదన యో
సుందర విగ్రహ మునిగణ
వందిత మిము దలఁతు భక్తవత్సల కృష్ణా! 100

కోటిమన్మధులవంటి మనోహర సౌందర్యతిలకా! మంధరగిరి పర్వతమును సునాయాసముగా నెత్తినవాడా! మధువనే రాక్షసుని చంపినవాడా! సుందరమైన విగ్రహము కలవాడా! మునిగణములచే నెల్లపుడు పూజింపబడువాడా! భక్తులవత్సలా! నిన్నే సదా స్మరింతునయ్యా.

క. అనుదినము కృష్ణశతకము
వినిన పఠించినను ముక్తి వేడుక గలుగున్
ధనధాన్యము గో గణములు
తనయులు నభివృద్ధిపొందు తద్దయు కృష్ణా! 101

ఓ కృష్ణా! ప్రతిదినమునీ శతకము వినినను, చదివినను వారికి పరలోకమందు ముక్తియు, ఈ లోకమందు ధనధాన్యములు, పుత్రాభివృద్ధియు విశేషముగ గలుగును.

శ్రీకృష్ణశతకము సంపూర్ణము

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః